శ్రీః

శ్రీవిద్యాస్త్రము — ౨

# కౌలమర్మ విభేదినీ

రచయిత

శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ విద్యాశంకర పదమావేశ
ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ
మహాంతాచార్య స్వాములవారు

స్వభాను ఫాల్గున బహుళ అమావాస్య

1944

శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠ సహాయ కార్యదర్శి
కొల్లపాటి వెంకట సుబ్బారావుచే
ప్రకటితము

 మూల్య మొక రూప్యము.

శ్రీసదనము—గుంటూరు

శ్రీః

శ్రీ విద్యాస్త్రము – ౫



శుద్ధస్ఫటిక సంకాశం సచ్చిదానంద విగ్రహమ్
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే॥
కామేశ్వరీం పరామీడే కాదిహాది స్వరూపిణీమ్।
మాతృకావర్ణ లిప్తాఙ్గీం మహాశ్రీ చక్రమధ్యగామ్॥

# కౌలమర్మ విభేదినీ

ఇదివఱకు శ్రీ విద్యాస్త్రములో నగ్రగణ్యములు రెండు వినియోగింపఁబడినవి. కౌలికులు దమ తస్కరభావమును సర్వ విధముల నవలంబించి సహజ సిద్ధమగు వంచకత్వముతో మెలగుచున్నట్లూహింప వలసి వచ్చుచున్నది. వీరలు తమ తమ తస్కరత్వ వంచకత్వములు మీరఁ దేలుకట్టిన దొంగ వలె నంతరంగమునఁ బొక్కుచు వెలుపలకు గంభీరమగు మౌనమును ధరియించి యున్నట్లు నభినయింపుచున్నను వీరలను లోకమున నెఱుఁగని యిరుగు పొరుగు వారలు లేకపోలేరు. వారలను కౌలికులు పశువులనియు మూర్ఖులనియు నపహసింపుచు నిజేచ్ఛ జరించుచుండుట నెల్లరకును దెలిసిన విషయమే. కాని పాప మిరుగు పొరుగు వారల వివేకముచే నైననేమి కారణాంతరములచే నైన నేమి ఏమియునన లేక నూరకుండుటచే నీకౌలికులు దమదుర్నయముచేఁ జెలరేగుచున్నారలు అట్టి దుర్న

యమునుండి వైదిక ధర్మమును రక్షింపనీకౌలమర్మ విభేదిని విని యోగింపఁ బడుచున్నది.

ఈ కౌలమర్మ విభేదిని యందు - కులార్ణవ తంత్రము నందు నుత్తమ ధర్మములుగఁ జిత్రింపఁబడినట్టియు శ్రుతిస్మృతి సదాచారములచే నత్యంతము ప్రతిషిద్ధములుగ నిర్వచింపఁ బడినట్టియు విశేషము లుల్లాసక్రమమున నెత్తి ప్రకటింపఁబడు చున్నవి. అట్టి విశేషముల వలన కౌలికుల యందలి మ్లేచ్ఛ చండాలాదిభావము వైదిక ధర్మ నిష్ఠులకుఁ బుష్కలముగఁ దెలియ వైదికధర్మ నిష్ఠులగు ద్విజులీ కౌలికాధములగు బ్రాహ్మణ వేషధారుల నుండి సర్వ విధముల దొలఁగి తమ ధర్మము నుండి ప్రత్యుతి జెందకుందురుగాక! వైదికధర్మ నిష్ఠులీ కౌలికాధములగు బ్రాహ్మణాధములెట్టి వైభవముతో బాహ్యమునకు రజ్జుసర్పమట్టులు భాసింపుచున్నను వాస్తవ ముచే మ్లేచ్ఛ చండాలాది సదృశులే, వే యేల నంతకంటెను నికృష్టులగు దుర్మార్గులే యని యెంచి యట్టి బ్రాహ్మణ వేషధారులతో సహవాస సహభోజన సవ్యవహార సంసర్గము లందుఁ మ్లేచ్ఛ చండాలాది జాతులతో నెట్టి విధమునఁ జరింపు చున్నారో యా తీరున సర్వ విధముల నీకౌలికాధముల సర్వ విధముల నస్పృశ్యులగు పంచములుగాఁ దెలిసికొని వ్యవహ రించుచుండ వలయును. లేనిచో సర్వవిధముల ననర్థములకుఁ బాల్పడుదురు. ధర్మవిశేషము - ఇఁక నిచట ప్రదర్శింపఁబడిన మర్మశ్లోకముల విశేషమునుండి వైదిక ధర్మమునకుఁగల విభేద మును దెలుపుటయేఁకాక నిట్లు కౌలధర్మము నాశ్రయించియుం

డిన బ్రాహ్మణవేషధారులు దుంబరఫలమట్లు సంతరంగమున నెట్టి హేయస్థితియందుబడియున్నారలో యయ్యదిసంక్షేపంబుగ వివరింపబడుచున్నది. ప్రాజ్ఞులు ధర్మసూక్ష్మమును గమనింతురుగాక! ఇందు ప్రప్రథమమునుండియు నుల్లాసక్రమమున కులార్ణవమునందలి కౌలమర్మము చక్కగ వెల్లడి చేయఁబడును.

ఉల్లాసము — ౧ "మొదటియుల్లాసమునకు" జీవస్థితి కథనమను నామ మీయఁబడియున్నది. ఇందలి దేవీప్రశ్నము సర్వ నరులకు నొక్క పెట్టున ముక్తిలభించు సాధనమని "కేనోపాయేన దేవేశ ముచ్యతే" యను వాక్యము వలన తెలియుచున్నది. ఇట్టి ముక్తిసాధనమును గూర్చిన ప్రశ్నకు సమాధానముగఁ జెప్పఁబడిన

"బహునాత్రకి ముక్తేనరహస్యం శ్రుణుపార్వతి।
కులధర్మమృతే ముక్తిర్నాస్తి సత్యంనసంశయః"॥ అను

వాక్యమువలన - కులధర్మము - దక్క వేఱొండు దానివలన ముక్తిలభించదను ప్రతిజ్ఞ చేయఁబడుచున్నది. దీనింబట్టి ముక్తికి కులధర్మమే సాధనము వేరొకటి యెంతమాత్రమును గాదని యీయుల్లాసమునందు నిర్వచింపబడియున్నది. వైదికధర్మము - వైదిక ధర్మమునందు ముక్తికి జ్ఞానమన బ్రహ్మజ్ఞానమే ముక్తికి సాధనమనియు నట్టి జ్ఞానము సర్వకర్మ సన్న్యాస పూర్వకముగ నాశ్రయింపబడిన బ్రహ్మనిష్ఠ, లేక జ్ఞాననిష్ఠయను దానివలన నలవడుననియు నట్టి సర్వకర్మ సంన్యాసమునకుఁదగు యోగ్యతయగు సాధన చతుష్టయ సంప

గలుగువఱకు ప్రతిద్విజుఁడును స్వవర్ణాశ్రమోచిత నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానము నాచరింపఁ వలయుననియు మన్వాది స్మృతుల ప్రతిహాతముగ శాసింపుచున్నవి — ఇట్టి శాసనమునకు పరమ ప్రమాణములు — "సత్యంవద" "ధర్మంచర" యను వేదాను శాసనములు — ఇట్టి "సత్యంవద" యను విధ్యర్థ జ్ఞానముకొఱకు వేదవ్యాస మహర్షి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రము మొదలుఁగల్గిన వేదాన్త మీమాంసా శాస్త్రము నుపదేశించెను. ఇఁక "ధర్మంచర" యను విధ్యర్థ జ్ఞానముకొఱకు జైమినిమహర్షి "అథాతో ధర్మజిజ్ఞాసా" యను వైదికధర్మ మీమాంసా శాస్త్రము నుపదేశించెను. ఈరెండు దర్శనములయొక్క పరమ తాత్పర్య మన-భారతభూమియను నార్యావర్తనమున సృష్ట్యాదినుండియు స్వభావముచేఁ జనించియున్న — "ద్విజులు, ద్విజసములు, శూద్రులు, శూద్రసములు, అస్పృశ్యులు అను నైదు తరగతులందును అస్పృశ్యులను విడచి మిగిలిన నాలుగుతరగతుల ప్రజలందరును వారి వారిజాతికిఁదగువిధమున ధర్మ వ్యవస్థను జేయుట యందు ద్విజులకు నుద్విజసములకును వర్ణాశ్రమ వ్యవస్థచే నుచితములగు ధర్మములు శ్రౌతములనియును స్మార్తములనియు విభాగముచే నుపదేశింపబడి యవ్వాని విధానము కల్పసూత్రమను పేర నొప్పు గ్రంథవిశేషములతో నొప్పారుచున్నది. శూద్రులకు పౌరాణికమను విధాన ముపదేశింపఁ బడియున్నది. అస్పృశ్యులనఁ జండాలాది విభేదములతో నొప్పుజాతులు. వీరలకట్టి విధానమును శ్రుతి స్మృతులు విధించి యుండక వృత్తి విధానమును

మాత్రము గల్పించి యున్నవి. అట్టి చండాలాది జాతులు దమకు నుచితమగు జీవికలతో గ్రామోపాంత ప్రదేశములందు మాలపల్లెలను స్థలంబుల నివసించి యుండుట సకల జన విదితము - శ్రుతి స్మృతులందు తెలియ వచ్చెడి విధి శాస్త్రమంతయు - సత్యంవద ధర్మంచర" యను విధులు ప్రధానముగా గల్గి - బ్రహ్మవిదాప్నోతిపరమ్" అను సకల శ్రుతి శిరోవతంస భూతమైన సమన్వయమును జెందుచున్నది. - ఏ తద్విషయమునే శ్రీకృష్ణ భగవానులు „లోకేస్మిన్ద్వివిధానిష్ఠాపురాప్రోక్తామయానఘ" యని యుపదేశించి యున్నారలు - ఇక నైహికాముష్మికములకును నిశ్శ్రేయసమునకును సర్వ విధముల బాధకమగు మహాపాతకములను సంకరీకరణములను మలినీకరణములను, అవకీర్ణకరణములను జాతి భ్రంశకరణములను బోధించు నిషేధ శాస్త్రమంతయు నానృతంవదేత్। నపరదారాంగచ్ఛేత్। నసురాంపిబేత్। నకలంజంభక్షయేత్॥ బ్రాహ్మణోనహంతవ్యః" మొదలుగాగల ప్రతిషేధములు మూలముగా గల్గి ప్రవర్తించుచున్నది. పాతకములలో సురాపానము స్వర్ణస్తేయము, బ్రహ్మహత్య గుర్వంగనాగమనమును మహాపాతకములుగా నిర్వచింపబడి యున్నవి. ఇందు - బ్రహ్మహత్యయన బహువిధములగు నర్థమును గ్రహింపవలయును - బ్రహ్మశబ్దమునకు - బ్రాహ్మణుడనియును, జీవుడనియును చతుర్ముఖబ్రహ్మయనియును బ్రహ్మలోకమనియును వేదమనియును నైదారు విధములగు నర్థము సుప్రసిద్ధముగ దెలియవచ్చెడి - ఇట్టి యర్థ సందర్భమును యోజించినచో బ్రహ్మహత్యయన

బ్రాహ్మణ హింస, జీవహింస, యను రెండు విధములగు ప్రత్యక్ష హింసలు గాక - వేదముల ప్రమాణములనియును ధూర్త కల్పనము లనియును, నికృష్టములనియును భావనము చే నవ్వాని తిరస్కారముచే సంసిద్ధమగు యథేష్టాచరణము కూడ బ్రహ్మహత్యయనిఁ జెప్పఁబడును - దానం జేసియే బ్రహ్మహత్యయనునది మహాపాతకములలోఁ గూడ నగ్రి గణ్యమనియు నద్దానికి ప్రాయశ్చిత్త మించుకేఁయు లేవనియు కూడ మన్వాది స్మృతులు వచించునట్లు ఘోరపాతకముగా వినవచ్చుచున్నది. చెప్పబడుచున్నది, కనవచ్చుచున్నది.

ఇట్లు ప్రతిషేధ శాస్త్రమువలనను ప్రాయశ్చిత్త శాస్త్రము వలనను దెలియవచ్చుచున్న విషయమంతయు నధర్మమని చెప్పబడుచున్నది. ఇట్లు కర్తవ్యాంశమగు విషయమగు ధర్మమును నిషిద్ధమును హేయమగు నధర్మమును బోధించు ప్రమాణ గ్రంథరాజములు శ్రుతులును మన్వాది స్మృతులును - ధర్మ బ్రహ్మ మీమాంస శాస్త్రమును. ఇట్టి ప్రమాణశాస్త్రమునకు ననుగుణముగ బోధింపఁబడునదియు నాచరింపఁబడునదియును ధర్మమగుచు నైహికాముష్మిక నిశ్శ్రేయసములకు సాధనమగుచు పురుషార్థ మనఁబడుచున్నది. తద్విరుద్ధముగ బోధింపఁబడునదియు, నాచరింపఁబడునదియు నధర్మమగుచు సర్వవిధముల నరక హేతువగుచున్నది.

కులధర్మము- ప్రకృతము కులార్ణవముచే బోధింపఁబడుచున్న కుల ధర్మమనునది-శ్రుతి స్మృతులచేఁ జెప్పఁబడకపోవుట యటుండనట్టి శ్రుతి స్మృతులచే మహాపాతకములమూటయని

చెప్పందగినంతటి ఘోరముగ నున్నయది — ఏతద్విషయము రెండవయుల్లాసమునఁ దెలియవచ్చెడిని.

ఉల్లాసము ౨ — రెండవ యుల్లాసమునకుఁ గులమాహాత్మ్యమని పేరు. ఇందుఁ గులమాహాత్మ్యమిట్లుఁ దెలియవచ్చుచున్నది.

"సర్వేభ్యశ్చోత్తమా వేదా వేదేభ్యో వైష్ణవం పరమ్।
వైష్ణవాదుత్తమం శైవం శైవాద్దక్షిణముత్తమమ్॥
దక్షిణాదుత్తమం వామం వామాత్సిద్ధాన్తముత్తమమ్।
సిద్ధాన్తాదుత్తమం కౌలం కౌలాత్పరతరం నహి॥
చతుర్వేదీ కులాజ్ఞానీ శ్వపచాదధమః ప్రియే।
శ్వపచోఽపి కులజ్ఞానీ బ్రాహ్మణాదతిరిచ్యతే॥
సర్వకర్మవిహీనోఽపి వర్ణాశ్రమవివర్జితః।
కులనిష్ఠః కులేశాని భుక్తిముక్త్యోః సభాజనమ్"॥ — అని

పై నాలుగు శ్లోకములును గులేశునియొక్క కవిత్వమేగాని వేరొండుగాదు. ఈ శ్లోకములవలన దెలియవచ్చెడి యర్థవిశేషముగూడ శ్రుతిస్మృతిపురాణేతిహాసములందునఁగాని వేదములయొక్క యంగములందుగాని యుపాంగములందుగాని యెచ్చటను వినరాదు-గనరాదు. ఈ శ్లోకములకీ కులార్ణవమే యాకరము. కులేశుడేకవి. కవి హృదయ మన్ననో చార్వాక జైన బౌద్ధ హృదయ సదృశమగునట్టి వేదవిద్వేషనిందా పూరితమగు సహృదయము. ఈ శ్లోకములను విలోమముగా యోజించిన నీసహృదయునియొక్క వేదవిద్వేషము వేదనిందయు సువ్యక్తమయ్యెని — అదెద్ది

యన — కౌలముకంటె పరతరము లేదు గావున కౌల
మే పరమధర్మము. కౌలముకంటె దక్కువ సిద్ధాంతము.
సిద్ధాంతము కంటె నికృష్టము వామము, వామముకంటె
హీనము దక్షిణము దక్షిణము కంటె కనిష్టము శైవము,
శైవముకంటె న్యూనము వైష్ణవము వైష్ణవము కంటె
నధమము వేదములు - అని యభిప్రాయము గులేశుడగు
కవిచే నిర్వచింపఁ బడి యున్నది. ఇక వేదముల కంటె నధమ
మించుకేనియును నుచ్చరింపఁ బడలేదు. ఇందు వేదములకును
గులేశు నభీష్టమునకును సమము నుగ్రమముగా -
వైష్ణవము శైవము దక్షిణము వామము, సిద్ధాంతము అను
నైదు మతముల పేరులట్లేబదములు ప్రయోగింపఁ బడియున్నవి.
అవ్వాని భావమేమియో యయ్యది కులేశకులేశానులకే
యగమ్య గోచరము. మనకు దెలియదగు విశేషమిందు
లేదు. ఇఁక మనకు దెలియదగు విశేషము కులధర్మమును
నద్దాని మహాత్మ్య స్వరూపములు. ఇచ్చట నిర్వచింపఁ బడిన
న్యూనాధిక విశేషమునకు కులేశుని యొక్క మదరా లాపము
దక్క వేరొండు గారణము దెలియరాదు. కౌలపుటతిశయము
చతుర్వేదీ యను రెండు శ్లోకములచేఁ బలుక బడుచున్నది -
ఎట్టులన్న నాలుగు వేదములను జదివిన బ్రాహ్మణుడైనను
కులజ్ఞానమును గలిగి యుండకపోయినచో - శ్వపచాధముడన
చండాలాధముని కంటె నికృష్టుడనియు గులజ్ఞానమును గల్గిన
శ్వపచుడు గూడ బ్రాహ్మణుని కంటె గూడ నధికుడగు
చున్నాడనియు, జాతి వర్ణము ఆశ్రమము ధర్మము మొదలగు
వానితో నెట్టి యవసరము లేకుండ ద్విపాద మాత్రుడగు

నరుడు కల జ్ఞానమును బొందినచో నట్టివాడు భుక్తి ముక్తులకు నిలయమగుచున్నాడనియు జెప్పుటచే నీకులేనను వేదము లందును, తత్ప్రతిపాదితమగు వర్ణాశ్రమాది విభాగము నందును బ్రాహ్మణాది వర్ణ చతుష్టయము నందును వారి లకు విధింపఁబడిన ధర్మ విశేషమునందును గల ద్వేషము నైరస్యము మొదలుగా గల హృదయ ధర్మము తేటతెల్ల మగుచున్నది. ఇయ్యది కులేశుని యందు బుద్ధులనొట్టి బ్రహ్మహత్యయను మహా పాతకమును నిర్ణయించుటకు ప్రబల మానము - దానంజేసి యీ కులేశుడు ప్రకటింపు కల ధర్మ మునకు నిదానము బ్రహ్మహత్య యనునది. ఇయ్యది వైదిక ధర్మమున మహా పాతకములలో నగ్రగణ్యము - కుల ధర్మ ములలోఁ బరమ ధర్మము - అని సువ్యక్తము.

కులధర్మము— "పేయం మద్యం పలం ఖాద్యం సమాలోక్య ప్రియా ముఖమ్ । ఇత్యే వాచరణం జాప్యం పరిప్రాప్యం పరంపదమ్।

తృణం వాప్యవిధానేన ఛేదయేన్న నకదాచన ।
విధినాగాంద్విజంవాపి హత్వాపాపైర్న లిప్యతే॥

యని రెండు శ్లోకములచే కులధర్మమంతయు సూత్రప్రాయ ముగా నిర్వచింపబడియున్నది.

కులధర్మమని యతిశయముగఁ జెప్పఁబడిన ముక్తి సాధన మన్ననో-సంక్షేపంబుగ మూడు కార్యములుగ నిర్వ చింపఁబడి యున్నది. అందు మొదటిది మద్యపానము,

రెండవది మాంసభక్షణము మూడవది స్త్రీలయొక్క యధేష్ట గమనమును. ఇయ్యాదియే యన నీ మూడు కృత్యములే యాచరణ మన్నను, జాత్యమన్నను బొందవలసిన పరంపదమన్నను గాని వేరొండు లేదని "ఇత్యేవాచరణం" అను వాక్యమునందలి "ఏవకారము"చే నిర్వచింపఁబడు చున్నది. ఇక నిచట "మద్యమును" పానీయపు విశేషమును గూర్చి వైదిక యల్లానమంతయు వర్ణింపఁబడియున్నది. అచట ఫలమును గూర్చి సామాన్యముగ శిభూజల చరమ్మని చెప్పబడి యున్నను యిచట- "విధినాగాంధ్వ జవాపిహత్వా పాపైర్నలిప్యతే" యను నతిశయము నిర్వచింపఁబడియున్నది. కులేశునకు నభిమతమగు విధానమున గోవునుగాని ద్విజునిగాని యన బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులలో, నెవ్వరి నైనను జంపి తన్మాంసము భక్షించినను గోవధ, బ్రాహ్మణాదివధ మొదలుగా గల వధల వలన గలుగునట్టి పాపము లెంత మాత్రమును గలుగవు అని చెప్పఁబడుటచే నిత్యమును మద్య పానమును గావించుటయు. మాంస భక్షణకై గోబ్రాహ్మణ వధ నవకాశము గల్గినచోఁ జేయుటయే పరమ ధర్మమనియు నయ్యాదియే కులధర్మమనియు నిర్వచించిన కులేశుని దృష్టి యందు - "నసురాంపిబేత్, నకలంజంభక్షయేత్- బ్రాహ్మణోనహంతవ్యః॥ నపరదారాంగచ్ఛేత్" అను ప్రతిషేధ శాస్త్రము తదను గుణముగఁ బ్రవర్తించి యుండు ప్రాయశ్చిత్త శాస్త్రమును ధూర్త ప్రలాపముల కంటె నికృష్టభావమును బొందియుండినట్లు వేద ప్రమాణవిదులు గ్రహింప గలరు. శ్రుతిస్మృతి సదాచార ప్రమాణసృష్టిచే - సురా

పానము గోబ్రాహ్మణవధ, తన్మాంస భక్షణము, పరదార గమనము స్వర్ణస్తేయమును మహాపాపములుగా నిందింపఁబడి యట్టి మహా పాపములను గావించు వారలు మహా పాతకులుగ దెలియవచ్చుచుండ నట్టి మహా పాపములే యుత్తమమగు కులధర్మమనియు నట్టి పాపముల నాచరించనట్టి బ్రాహ్మణుఁడు శ్వపచాధముని కంటె నికృష్టుఁడనియు నట్టి పాపముల నాచరించు శ్వపచుఁడైనను బ్రాహ్మణుని కంటె నుత్తముడనియు బోధించు కులేనుఁడను తదుపదేశమే పరమ ప్రమాణముగాఁ దద్భిన్నమగు నర్థమును బోధించు శ్రుతిస్మృతులు నికృష్టములను నిష్ప్రమాణములనియుఁ దత్ప్రమాణ బద్ధులగు ద్విజులను శ్వపచులకంటె నింద్యులని తలంచుచు నెద్దియో యొక దేవతోపాసనము వ్యాజమున సర్వ జనులను వంచింపుచు మహా పాపములగు సురాపానము గోబ్రాహ్మణ హత్య మొదలుగాఁగల యకృత్యములను జేయుచు నితరులను వంచించి జేయించుచునుండు కలికాధములగు బ్రాహ్మణ వేషధారులగు కర్మచండాల తస్కరులు బ్రాహ్మణుల మధ్యమున బ్రాహ్మణులవలె చరింపుచుండుటకంటె ఘోరమగు సాహస మెందు నుండదని ప్రాజ్ఞులగు వైదికధర్మ నిష్ఠులు తెలిసికొనఁగలరు. నట్టి మహా పాతకులగు బ్రాహ్మణ వేషధారులను పెద్దలను భావముతోఁ జూచు ద్విజులెంతటి యజ్ఞానమున మునిగియుండిరో యూహించుటకుఁ గూడ నవకాశము జాలకున్నది.

ఉల్లాసములు — ౩।౪।౫।౬।౭॥ మూడవ యుల్లాసము మొదలుకొని యేడవ యుల్లాసము తుదివరకు గల

యుల్లాసము లందలి మర్మములను కౌలతస్కరమర్దనియందు నిర్వచింపఁబడిన వానిని గ్రహించి యందువలన గాలి లెట్టి దుర్మార్గులో ప్రాజ్ఞు లూహించుకొనగలరు. విశేషించి వ్రాయుటకుఁ జేతులాడక విరమించడ మైనది.

ఉల్లాసము — రా॥ ఎనిమిదవ యుల్లాసమున జాతి వర్ణ కుల గోత్ర విచక్షణ మించుకేనియు లేకుండ, ద్విజులు ద్విజేతరులు అస్పృశ్యులగు చండాలాదులును - స్త్రీ పురుష విచక్షణయును వావి వరుసల విభేదమును లేకుండఁ జేర్పఁబడి అర్చనమును జేర మకార పంచకమును పోగుజేసి నిజేచ్ఛగ భక్షించి యేడవ యుల్లాసమునఁ జెప్పిన తీరున మద్యపానము గావించి చరించు విధానముచే కవియొక్క హృదయ ధర్మము సువ్యక్తముగా వర్ణింపఁబడి యున్నది. ఇందు పరిధాన విధానము ఇట్లు నిర్వచింపఁబడియున్నది.

«యోగినో మద మత్తాశ్చ పతన్తి ప్రమదోపరి |
మదాకులాశ్చ యోగిన్యః పతన్తి పురుషోపరి ॥
మనోరథ సుఖం పూర్ణం కుర్వన్తిచ పరస్పరమ్ |
ఇత్యాది వివిధాం చేష్టాం కుర్వన్తి కులనాయికే ॥»యని

ఏతచ్ఛ్లోకము లందలి మర్మము నెల్లరును సులభముగ గ్రహించగలరు. చేతులాడక వివరింపలేము. కులభ్రష్టులకు మనోహరముగ నుండిన నుండవచ్చును. ఇట్టి కాలికాధముల గృహములందుండు స్వజనులగు స్త్రీలు అనగా భార్య పుత్రిక, తల్లి, తోబుట్టువు మొదలుగాగల స్త్రీ లెట్టి శుచిత్వముతో నలరారుచుందురో యద్దానిని చదువరులే యూహించుకొందురుగాక!

ఇట్టి శ్రీ చక్రము బిందుచక్రము శక్తి చక్రము భైరవీచక్రము అను నామములచే సమావేశము చేయబడిన సమూహమునందు జాతి వర్ణ కుల విభేదము లేకయే చరింపుదురా యనినచో నట్టి విషయము ఇట్లు జక్కగ నిర్వచింపబడియున్నది.

స్త్రీ వాథ పురుషః షండశ్చండాలో వాద్విజోత్తమః।
చక్రేస్మిన్నైవ భేదోస్తి సర్వేశివ సమాస్మృతాః॥
ప్రవృత్తే భైరవీ చక్రే సర్వే వర్ణా ద్విజాతయః।
నివృత్తే భైరవీ చక్రే సర్వే వర్ణాః పృథక్పృథక్ ॥”

అని అహాహా యేమి చిత్రము - పవిత్రముగ దలంచంబడు దేవతార్చన కాలమున నేరికిని జాతి కుల వర్ణ విభేదము లేదట. అందరు నొకే కులమట యథేష్టాచరణమునకు మాత్రము స్త్రీ పుం. విభాగ మాత్రమట, అందరును స్త్రీ పుం. నపుంసక చండాలాది విచక్షణలేక నెల్లరును శివులే నట. ఇక యథేష్టాచరణమునుండి యొకలు దెలిసి లౌకిక వ్యాపారమునకు దిగినచో జాతి కుల వర్ణ స్త్రీ పుంషండ చండాలాది వ్యవహారమట. ఎంతటి దుర్న్యాయ వ్యభిచారమో ధర్మవిదులు గమనింతురుగాక!

వైదిక ధర్మము— వైదిక ధర్మమన్ననో సకల జనులను స్పృశ్యులు అస్పృశ్యులను విభాగమును జేసి యస్పృశ్యులతో స్పృశ్యులకు సహవాసమును స్పృశ్యతను గూడ సర్వవిధముల నిషేధింపుచు స్పృశ్యులగు జాతుర్వర్ణ్యముల వారలకును సహవాసము సవ్యవహారముల నంగీకరింపుచు కర్మా

చరణ కాలములందును దేవతారాధన కాలములందును నియతమగు వ్యవస్థలో ధర్మమును బోధించుచున్నది.

ఇక కలిధర్మము నందన్ననో వ్యవహారకాలమునందు విశేషమును దేవతారాధన కాలమునందు జాత్యాది భేద రాహిత్యమును అయ్యది యత్యంతము రహస్యములు. ఆహాహా పవిత్ర కాలమను నపుడు లేని విభాగమునకు వ్యవహార కాల మందలి నూతనత్వ మేమియో ప్రాజ్ఞు లూహించ దగిన విషయమే. ఇయ్యదియ కాలచార్యము దుర్మార్గము లోక వంచనమును. కాలధర్మమే పరమ ధర్మమైనచో స్త్రీ పుం విచక్షణ లేకుండ సర్వ కార్యములందును గైస్తవు లట్లు నొక కులముగ వ్యవహరించినచో బహిరంగమున నెన్నియో ఐహిక ప్రయోజనములు బడయ వచ్చునే ఈ కాలికులు దివాంధములభంగి పగటియందొక వేషము రాత్రియందొక వేషము వేయుట ఏలకో? ఇట్లు వేషవైచిత్ర్యమును ధరించుటచే నాత్మ ద్రోహమును జేసికొని లోక వంచనము సేయుట కదా. ఇట్లు వంచకత్వము కలమునం దంగీకరింపఁ బడు చున్నదా యన—

ఉల్లాసము:— ౧౧ శ్రీ చక్రకృత నృత్తాన్తం శుభం వాయదివాశుభమ్। కదాచిన్నైవ వక్తవ్య మితాజ్ఞాపరమేశ్వరి॥

అన్తః కౌలో బహిః శైవః పూజన మధ్యే తు వైష్ణవః।
కౌలం సుగోప యేద్దేవి నారికేళఫలాంబువత్ ॥

ఈ రెండు శ్లోకముల వలనను గాలికునకు నన్వృత

వదనము సర్వవిధముల విధింపబడు చున్నది. వైదికధర్మ మన్ననో "వేదేల సర్వజనులును నానృతం వదేత్" అను విధిని పరమ పవిత్రముగాఁ దలంచుచుండ నీ కులేశు డన్యావ దేశముగ "అనృతం వదేత్" అను విధిని బోధించు చున్నాఁడు. ఇదియే కవికృత మగు కులార్ణవ తంత్రమునకు మొదటిధ్వని "సురాం పిబేత్" అని ప్రత్యక్షవిధి" పరదారాన్ గచ్ఛేత్" అని రెండవ ధ్వని - శేషించిన గ్రంథమంతయు కవియొక్క సహృదయ కల్పనమే కాని వేదాంశ ప్రమాణాను ప్రాణిత మెంత మాత్రమును గాదు. ఇఁక గలికవక సురాపాన విధితోఁ బాటు విధింపఁబడిన ప్రత్యక్షవిధి మరియొకండు నిట్లు నిర్వచింపఁబడి యున్నది.

"మాతరం పితరం భార్యాం భ్రాతరం బాంధవం సుతమ్॥
కులనిందాకరం దేహం హన్యాదేవా విచారయన్ ॥" అని

వైదికధర్మ "మహింసా పరమో ధర్మః" యని బోధించుచుండఁ గ కులేశుడు సర్వవిధములగు హింసను దన తాంత్రిక బోధనమును గాపాడుకొనుటకు విధింపుచున్నాఁడు. తాంత్రిక బోధనమే సకలమగు దుష్కృత్యములకు మూలము. అయ్యది ప్రారంభించినవానికి మిగిలిన పాతకము లప్రసిద్ధములే. అర్చనావ్యాజమునకై నైవేద్యమునకు గోబ్రాహ్మణ వధను విధించు కులేశునకు నితర వధలు తృణప్రాయములని వచింప నక్కఱ లేదు.

ఇట్టి కులేశ కృత్యములను మన్వాదులు అకృత్యములుగా నిర్వచించి యవ్వాని నెవ్వఁడైనను ప్రమాదము వలన నాచరించినవానికి ప్రాయశ్చిత్త శాస్త్రమును విధించిరే యవ్వాని

ప్రసక్తి కాలికునకు లేదా యనినచో క్రతేశు డిట్లు నిర్వచించి యున్నాడు.

"ప్రాయశ్చిత్తం భృగోః పాతః సన్న్యాసం వ్రతధారణమ్ ।
తీర్థయాత్రాభిగమనం కాలః పంచ విసర్జయేత్ ॥

అని ప్రాయశ్చిత్త కాండమునఁ బాపములుగా నిర్వచింపఁబడిన విశేషములే పరమ ధర్మములుగా నాచరించు కాలికాధములకు బ్రాయశ్చిత్త కాండపు భయమెందు గలుగును? పాపభీతి యనునది యుండఁగూడదని "నిర్భయతా సర్వత్ర" యని పరశుసూత్రము బోధింపుచునే యున్నది. ఈ ప్రాయశ్చిత్తమును విధించు విబుధలోకమునందు నిందకేని యుపేక్ష్య ముండఁగూడదని— "అగణనం కస్యాపి" యను సూత్రము గంభీరముగా జెప్పుచున్నదే. వేయేల ప్రాయశ్చిత్తమును విధించు బ్రాహ్మణులకంటెఁ గులనిష్ఠుఁడగు శ్వపచుఁడే యధికుఁడుగ నిర్వచింపఁబడుచున్నాఁడు. శ్వపచునికంటె నీచులుగఁ దలంచఁబడు వేదవేత్తల యాక్షేపాదికము వలనఁ గులనిష్ఠున కించుకేనియు భయము లేదుగదా. అంతియకాదు. పాపనోదకములుగ విధింపఁబడు ప్రాయశ్చిత్తమును, అందు విధింపఁబడు భృగోః పాతము సంన్యాసము, వ్రతధారణము, తీర్థయాత్రాభిగమనమును నిందకములుగాఁ గాలికునిచేఁ ద్రోసిపుచ్చవలయునను పై విధి పరమ ప్రమాణముగాఁ దలంచు కాలికాధములు ప్రాయశ్చిత్త విశేషములకుఁగూడ పతితులగుచున్నారు. వేయేల ప్రత్యక్షశ్రుతి సదాచార స్మరణిని యోజించినవో నీ కాలి

సాధనములగు బ్రాహ్మణ వేషధారులను పూజారులుగఁ జేయ గలుగు ప్రాయశ్చిత్త విశేషములు పరిష్కృతముగఁ దెలియ వచ్చిన ప్రాయశ్చిత్త కాండమున నెంతటను లభించునేమో యను భయము గలుగుచున్నది. వైదికధర్మ రక్షణ తత్పరు డగు రాజన్యులచే నింతవఱ కీ కౌలికుల యొక్క తస్కర త్వాసనము నుండి వైదికధర్మ మెట్లు ముక్తి బడయునో దెలియకున్నది. పాపము శాంతించుగాక !

ఇక నీ కౌలసిద్ధయున్మత్త మాత్తము ధర్మములు రెండు గలవు. అవ్వాని మర్మములను జెప్పి పరిష్కృతము నుపసంహ రించుచున్నాము. ఈ రెంటిలో నగ్రగణ్యము కౌలజ్ఞార్చనము వ తన్మయము కౌలార్ణవమున తొమ్మిదవ యుల్లాసమున విధింపఁబడి యున్నది.

కౌలజ్ఞాదన — సదామానసా సపూల్లాసీ సదాచరణ చింతకః
సదాసంశయహీనో యః కులయోగీస ఉచ్యతే॥
పిబన్మద్యం పలంఖాదన్ స్వేచ్ఛాచారపరాయణః।
అహంతదనయోరైక్యం భావయన్విహరేత్సుఖీ॥-

కట్టి కౌలజ్ఞుల నర్చించు విధానమిట్లు విధింపఁబడి యున్నది.

“యో దేవిస్వయమాహూయ కౌలజ్ఞాన్ శుభవేదినే।
అభ్యర్చ్య దేవతాబుద్ధ్యా గంధపుష్పాక్షతాదిభిః॥
మూర్ధభిః పంచముద్రాభిః సద్భక్త్యా పరితోషయేత్।
తేషుతుష్టేష్వహంతుష్టః తుష్టాస్స్యుః సర్వదేవతాః।
భగినీం వసుతాం భార్యాం యోదద్యాత్కౌలయోగినే।
మధుమత్తాయదేవేశి తస్యపుణ్యాసగణ్యతే॥-యని

కౌలసిద్ధుడు కౌలజ్ఞనర్చించి మధుమత్తుఁడగు కౌలజ్ఞునకు దన

మాంసాది భక్ష్య భోజ్యైర్ద్రవ్యైస్తోషయేద్దేవిక్షితీశః।
జపాదికం సమర్ప్యాథ తయా సహ నిశాం నయేత్ ।
దూతీయాగంతు యః కుర్యాత్ స్వోక్త విధినా ప్రియే।
ఆజ్ఞాసిద్ధిర్భవేత్తస్య దేవతా ప్రీతిమాప్నుయాత్ ॥-అని

ఇట్టి విధిననుసరించి ప్రతి కులస్థుడును ప్రతి శుక్రవారమును తప్పక చండాల స్త్రీగమనము జేసి తీరవలసినదే. కావున కులస్థులగు పురుషులు చండాల స్త్రీగమనమును నియత వ్రతముగ నాచరించువారలును వారల యిండ్ల యందుండు స్త్రీలు కులజ్ఞుల సభకు రానవసరమును గ్రహించినవారలతో వ్యభిచారమును జేయుటకు బ్రేరేపణ జేయబడి యథేచ్ఛముగ జాతికుల విచక్షణ లేకుండ దను యిచ్చవచ్చినట్టుల పురుషులతో జరించు లంజలుగను సంచరించుచుండురనినచో నించుకేనియు నాశ్చర్యముండగూడదు.

ఇయ్యది కులస్థుల యిండ్ల యందుండెడి పురుష స్త్రీ స్వభావ మర్మ విభేదనము,

ఇంతవరకు వ్రాయబడిన దానివలననే లోకమచ్చెరువు పొందవచ్చును. లోక సంగ్రహమునకు వైదిక ధర్మ సంగ్రహమునకు నిట్టి కులమర్మమును వ్రాయలేక వ్రాయుంచడనైనది. ప్రాజ్ఞులు ప్రయోజనమును బడయుదురు గాక!

అనుశాసనము— శ్రోత్రియులమనియు మంత్ర శాస్త్ర వేత్తలమనియు, శ్రీ విద్యోపాసకులమనియు పంచక వేషములతో బాహ్యమునందు వ్యవహరించుచు ప్రచ్ఛన్నముగ మద్యము, మాంసము, మత్స్యము, ముద్ర, మైథునము అను పంచమ

కారములను యథేచ్ఛముగ సేవింపుచు అభక్ష్య భక్షణము అపేయపానము. అగమ్యాగమనములను ఉపాసనాధర్మములను పరగావించుచు చండాలురకంటె నికృష్టములగు వ్యాపారములను నిత్యముగ గృహాంతరంబులందు జేయుచుండు కర్మ చండాలురగు నట్టియు, గోబ్రాహ్మణ వధనైన జేయుటకు వెనుదీయ నట్టియు డాంబిక బ్రాహ్మణ వేషముతో జరింపుచుండు వైదికధర్మద్రోహులగు గాలికాధములయొక్క దుష్టములగు నానోపాయములలో శ్రుతిస్మృతి సదాచారపరిమాణబద్ధులగు చాతుర్వర్ణ్యమువారును బడి పరిచ్యుతిని జెందకుండుటకు గాను మైనవ శ్రీవిద్యాశాస్త్రము శ్రీపీఠ శిష్యబృందములగు చాతుర్వర్ణ్యము వారికి ననుగ్రహింపబడుచున్నది. కావున శ్రీపీఠ శిష్యబృందములగు చాతుర్వర్ణ్యము వారును "కాలమర్మవిభేదిని" ని సంపాదించుకొని తన్మూలముగ దుష్టకాలియులగు కర్మ చండాలురగు బ్రాహ్మణ వేషధారుల దౌర్జన్యమునుండి పరిమాదమును జెందకుండ సర్వవిధముల వ్యవహరింపుచు దమయొక్క ధర్మమును గాపాడుకొందురుగాక యని శాసింపుచున్నారము. ఇతి నారాయణస్మృతిః

[illegible]

సుభాను ఫాల్గున బహుళ అమావాస్య
24—3—1944